...వివిచారంలో తన పూరిగుడిసె ముంగలిమీద కూర్చొని ఉన్నాడు.

నవయౌవనభాగ్యశాలి చాల సుందరమైనవాడు. చక్కని నునుపైన శరీరము విశాలమైన నేత్రాలు, కోకిలకంఠస్వరం, ఏధుర్యమైన గానం.

అతని ప్రతాపరెడ్డి అపూర్వదేశముఖు నవయువకుడు కొంచెం అందగాడే, కాని కఠినహృదయుడు ఔర్జన్యప్రియుడు అతడే అవూరికి ప్రభువు అతనికిష్టములేకుంచి ఎంతటివాడైనా, అవూళ్లో కాపురంచేయలేడు. అదొరవారు గుర్రాలున్నకొన్నా, మోటారుకొన్నా, వారియింట్లో పెండ్లైనా, చావైనా ఖర్చులు వూరిమీద వసూలుకావలసిందే, గ్రామంలోనగానికి యెక్కువసేద్యం యితనిదే. అప్పులిచ్చి, నాగులకచ్చి, గిరువు పెట్టించుకొని, దగాచేసి ద్రోహంచేసి రైతులభూములంతా లాక్కున్నాడు.

కొండయ్య పేదవాడే, నాలుగెకరాల వ్యవసాయము, గొడ్డు గోదా, జీతగాండ్లు చేతగాండ్లతో ఆటుహాసంగావుండేవాడు, కాని పంటలుపండక ధరలు లేకపోవడము సర్కారుకిస్తు, దొరవారిదండుగలు ఎక్కువ కావడమువల్ల అంతాపోయింది. ఇప్పుడు నాలుగుఎకరముల భూమి వూరివెంబడేఉన్నది. అందులోనే ఒకగుడిసెవేసుకొని కాలముగడుపుతున్నాడు ఆవున్న నాలుగు ఎకరాలుగూడ దొరవారికి తాకట్టుపెట్టాడు.

పొద్దున దొరవారుపిలిచి "నెలరోజులలో నాకు బాకీఉన్న రూపాయిలు చెల్లించాలె. లేకపోతే మళ్ళా ఫసలీతారీఖున నీజమీను ఖబ్జాచేసుకుంటా" అన్నాడు. కొండయ్య ఒతిమాలాడు, భంగపడ్డాడు. లాభంలేకపోయింది పైగా "ఎక్కువతక్కువమాట్లాడితే మెడపట్టి అవతలనూకిస్తా ఖబర్దార్" అన్నారు దొరవారు. కొండయ్య ఇంటికివచ్చాడు. తనపూరిగుడిసెలోమంచంమీద కూర్చొని విచారపడుతున్నాడు.

హా భగవంతుడా! రోజులు ఎంతలోమారిపోయినవి! ఎంతటిమర్యాదగా ప్రతీ దొరవారితండ్రి నన్ను ఎంతగౌరవంగా చూచేవాడు! నేటెస్థితి యిదిఅయినను ఈకుమార్తెకు బదులు ఒక కుమారుడేఉంటే, ఇంతవిచారం లేకపొయ్యేది" అని అనుకొన్నాడు.

జానకి చూచింది తండ్రిస్థితి. అడిగింది. తెలుసుకొంది. కండ్లనీళ్లు పైటచెంగుతో తుడుచుకుంది. ఆలోచించింది. ధైర్యము తెచ్చుకొని అనుకుంది. "తండ్రిదుఃఖము కొడుకే తీర్చాలా? కూతురు తీర్చలేదా? చూస్తా, దొరవారిదౌర్జన్యం కఠినహృదయం కానీ"

ప్రతాపరెడ్డి దొరవారికి దయ, ప్రేమ అనే వస్తువేలేదు. ఒకవేళ ప్రేమవుంటే పైసామీద, లోకుల సొమ్ముమీద అవిషయంలో ఎవర్ని కనికరించేదిలేదు. అయినా యువకుడు.

జానకి అతనిపై సౌందర్య ప్రేమలవల విసరింది.

కొండయ్య యింటివెనకనే దొరవారి తోట ఉంది. పూలచెట్లు మామిడిచెట్లు, అరటిచెట్లు, అనేకరకాల యితరచెట్లు వున్నాయి. దానిలో పెద్ద దిగుడుబావికూడా ఉంది. పూరిలోనుంచి నేరుగా ఆతోటలోకి రోడ్డువేయించాడు దొరవారు రోజూ తోటకు సాయంత్రం మోటారుమీదనో, నడిచో హవాఖోరీ వస్తుయుండేవారు. ఎప్పుడూ వెంట కొందరుండేది ఒకొక్కప్పుడు వంటరిగాకూడావచ్చేవారు. జానకికూడా ఆదేబావికి సాయంకాలం నీళ్లకు వెళ్లుతూవుండేది.

"అరో- దొరవారు వచ్చేసమయమైనదే, కుండ బుజానపెట్టుకొని యేదో పాటపాడుతుంటూ నీళ్ళకు వెళ్లింది బావిలోదిగి కుండ బోర్లించి దరువువేస్తూ పాటపాడుతూవుంది.

ఆ మాధుర్యమైన గానం విని, మెల్లగా ప్రతాపరెడ్డి బావివద్దకు వచ్చాడు. చూచాడు, చక్కదనము చక్కదనమునకు తగినపాట. విశ్వేష్టుడైనాడు. కొంతసేపైనతర్వాత సకిలించాడు

జానకి వెనకకు తిరిగిచూచి నవ్వింది.

"నీవెవరిపిల్లవు?"

"కొండయ్య కూతుర్ని."

# ఆత్మార్పణం

"అగుడిసెలోవున్న కొండయ్యకూతురివా?"

"అ-అవును కొదా! అకొండయ్యే."

ప్రతాపరెడ్డి తల వంచుకున్నాడు "వూహూ! ఆకొండయ్యకూతురా? ఎవరిభూమి? నేను-ఇప్పుడు-వస్తువు-ఈపిల్ల-కొదు-కొదు."

ఏమిచెయ్యాలో, ప్రతాపరెడ్డికి తోచలేదు మళ్లిఒకసారి చూచాడు-"ఇంతమంది స్త్రీలను చూచాను కొని ఇటువంటిది . . . . ."

జానకి కుండలో నీళ్లుముంచుకొని, బుజానపెట్టుకొని బయలుదేరింది.

ప్రతాపరెడ్డి -కొంచెమాగు.

జానకి -ఎందుకు?

ప్ర -నేనెవరినో ఆడిగలేదే.

జానకి-నవ్వుతూ నేను నిన్ను ఎరుగుదు, మీరు మా యజమానులు, దేశముఖులు.

ప్ర -అప్పుడేపోతావా

జానకి.-నేను గరీబుగాని కూతుర్ని. ఇంటికిపోయి వంటచెయ్యాలె.

ప్ర-చిన్నని నిశ్వాసంవిడిచాడు ..రేపుకూడా నీళ్ళకువస్తావా.

జా:-(నవ్వి) నేను ప్రతిరోజూ ఇదేవేళ్లకు నీళ్లకు వస్తాను.

ప్ర:-నిన్ను ఎప్పుడూచూడలేదే.

జా -ఇంతకుముందు చూడకపోవచ్చును. మేము మొదటినుండి దరిద్రులముగాము - మాకద్దకూడా జాకర్లు వుండేవాండ్లు, వాండ్లేనీళ్లు తెచ్చేది. ఈగతపట్టింతరువాత జీతాలుయివ్వలేక తీసివేసినాము. నేనే తెస్తున్నా-అప్పుడే యేడుయింది. ఇప్పుడు నీళ్లుతేకటమే చూస్తున్నారు. ఆకొస్త భూమిపాయింతరువాత బిచ్చమెత్తుకొవటంకూడా మాస్తారు. [అంటు వెళ్లిపోయింది]

"ఎట్లానైతేనేమి? నేడు నీఋణములుతీర్చాను"

కొండయ్య యింకా అందోళనలోపడ్డాడు.

"నేను పరువుప్రతిష్టలుగల వంశంలో జన్మించాను. నీవు మరచిఉండవచ్చును. నీవు ఈకాగితం ఎట్లాసంపాదించావో చెప్పేదాక నేను చేతితోముట్టను. ఆకలితో చస్తానుకాని, అప్రతిష్ఠపాలుగాను" అని అకాగితమువిసిరి పారేశాడు.

జానకి కాగితము చేతికందిచ్చి "తండ్రీ నేను పేరుపొందిన వెలమ వంశమున్నే జన్మించాను. గౌరవమర్యాదల నిలుపుకొనే [illegible] సందేహింపకు" అన్నది,

"ఎట్లా? దొరవారిని దగాచేసి తెచ్చినావా?"

--లేదు. నాపాట వినుపించాను. ఆనందపరవశుడైనాడు. ఏం కావలెనని అడిగాడు మాబాకీ రద్దుచేసి కాగితం ఇమ్మన్నాను. ఇచ్చాడు నేను మొదట ఎట్లుఉన్నానో అట్లాగే ఉన్నాను. భగవంతుడే సాక్ష్యం" అన్నది

తండ్రి సంతోషించి బిడ్డను కౌగిలించుకున్నాడు. ముద్దుపెట్టుకున్నాడు. నాకు కొడుకులు లేరని దిగులులేదు " అన్నాడు.

* * * *

రాత్రి ఎనిమిదిగంటలవేళ ప్రతాపరెడ్డితోటలోఉన్న బంగళాలో అటూయిటూ తిరుగుచు ఎదురుచూస్తున్నాడు "ఇంకారాలేదే! ఎనిమిది గంటలకే వస్తానన్నది ఇప్పుడు ఎనిమిన్నర అయింది ఏంకారణం? ఇంకారాలేదే" అని తొందరపడుతూ ఉన్నాడు,

"ఈదుర్మార్గుడు ఈకొద్ది రోఖమునకు నన్ను కొనదలచాడు. తాను చేసిన వుపకారానికి ప్రత్యుపకారం కోరాడు. ప్రేమించాడు. రాత్రి ఎనిమిదిగంటలకు వస్తాననిమాటయిచ్చాను. వాడు దుర్మార్గుడని తెలిసికూడా ప్రేమచూపాను.

## శ్రీయుత ఉన్నవ వేంకట రామయ్యగారు

అప్పటినుండి ప్రతిరోజు ఆదేవేళకు నీళ్లకు జానకి, హవాఖోరీకి దొరవారు తోటకువచ్చేవాండ్లు. "దొరవారు బాకీ కొరకు పెట్టినవాయిదా ఇక నాలుగురోజులేవుంది. ఆవాయిదాకు రకంకట్టాలె లేకపోతే అభూమికొస్తా ఆక్కుంటారు. నావిచారానికి కారణం అడుగుతారు. సంగతి చెప్పింతరువాత మాట్లాడరు. మాట వరుసకైనా "పరవాలేదులే, మీభూమి మీకేవుంటుంది-విచారపడకు" అని అనరు నేను ప్రేమచూపుతానుకొని, అభూమిసంగతి ఎత్తటానికి ధైర్యంచాలదు. అందుకోసం పన్నినపన్నుగడఅని అనుకుంటాడేమో-నిజంగా వీరి రాతిగుండె పైకిమాత్రం ప్రపంచములో ప్రేమకుమించిన వస్తువే లేదంటాడు .-" అని అందోళనలోపడి కొట్టుకొనుచున్నది జానకి

ప్ర:-జానకి, యెన్నిండ్లే వాయిదా.

జా:-అవును యెన్నిండ్లే! నాతండ్రికి మృత్యుసందేశము తీసుకొని వస్తున్నది

ప్రతాపరెడ్డి "అవును" అని ఆలోచనలో పడ్డాడు కొంతసేపైనతరువాత జానకి చేతులను ముద్దుపెట్టుకొని, జానకీ "యెన్నాళ్లు బాకీఉన్నది?

జా.-(చేయువిడిపించుకొని) ఎన్నాళ్లవరకు నీకు కోరికఉంటుందో అన్నాళ్లు!

ప్ర.-మంచిది రేపు కాగితముపై బాకీచెల్లు వ్రాయించి తెచ్చియిస్తా (అని జానకి చేయి ముద్దుపెట్టుకొని) పోయినాడు!

* * * *

మరునాడు సాయంత్రంకాగితంతీసుకవచ్చి తండ్రికియిచ్చింది! కొండయ్య దీపందగ్గరకిపోయి జోడుపెట్టుకొని, బాగా రెండుమూడుసార్లు చదువుకున్నాడు. ఆనందపరవశుడైనాడు. కాని సందేహం కలిగింది.

"జానకీ, జానకీ, ఈ కాగితం ఎట్లా తెచ్చావు."

ఎట్లవాసరే పోవాలె" అని జానకి తోటలోనున్న బంగళాకు బయలుదేరింది.

* * * *

మెట్లపైన కాలిచప్పుడు వినబడ్డది. ప్రతాపరెడ్డి చూచాడు అతనిఆనందానికి మితిలేదు. "జానకీ! నేడు ఎంతటి పుణ్యదినం! నేను ధన్యుడైనాను." అని గట్టిగా కౌగిలించుకున్నాడు.

జానకి దొరవారికౌగిటిలో ఒదిగింది. పెదవులల్లాడుతవి. మాటలేదు. వళ్లుజలదరించుచున్నది

దొరవారు తత్తరపోయినారు. "జానకీ, జానకీ ఏమిది! ఏమిది!" అని ఆక్రందనచేశాడు

జానకి అతికష్టముతో కండ్లు తెరచుకొని, దొరవారినిచూచి, "ఇది నీ వుపకారమునకు ప్రత్యుపకారము. ధనము, భూమికిబదులు ఒక నిర్భాగ్యపుకన్య ప్రాణము!

దొరా, నీవుఎరుగవా నేను వెలమకన్యను. ఇంతవరకు రాకుండానే ప్రాణం వదలదలచితినికొని, నీతో మాటయిచ్చినందుకు రావలసివచ్చింది" ఈమాటలలో ఎన్నినిముషాలుపట్టినదో అంతే. మరిమాటలేదు.

* * *

ప్రతాపరెడ్డి దీనివలన జీవితరహస్యమేమి గ్రహించాడో కాని, ప్రాణము పోయదలచినవాడు యివ్వటానికి సిద్ధపడ్డాడు. గోడకుతగిలించియున్న కత్తితీసి ఒయములో చేతితో మెరిసింది. మరుక్షణమే-క్రిందపడ్డాడు.

అతికష్టముమీద ఎంతోసేపటికి జానకిదగ్గరకుచేరి ముఖములోముఖము పెట్టాడు బాగా చూచాడు ఇద్దరి పెదిమెలుకలిసినవి-ఇదేవారి ప్రేమకు మొదలుతుద.

తరువాత అతోటవద్ద పూడుకట్టారు. జానకీపురంఅని పేరుపెట్టారు. పార్వేశ్వరాలయమని దేవాలయముంది. ఇప్పటికి శ్రావణశు|| 3కి గ్రాములందరుచందాలువేసుకొని జాతరచేస్తూరాటూరు.

---

(౧-వ పేజీ తరువాయి)

సారి పూలువిసంట వచ్చినందువలనను, దానివిషయమై శ్రద్ధ అంతగాఉండదు ఈ తోటల పంట పేనెలలో కోయబడును.

ఆకాలములో అందముగనైకత్తిరింపున ఎక్కువ చూడలేదు.

ఎరువు-దొడ్డిపెంటను ఒకదానినేఉపయోగింతురు.

నల్లఅంగూర:-ఇక్కడి తోటలలో ఒకదానిలో ఈరకమువి కొన్ని మొలకలున్నవి. ఇవి చాలవేగముగ పెరుగునవి యైనను, స్థానికజాతులకంటె వేగముగ పెరుగునవియైనను, ఈజాతియొక్క పండ్లు అధికముగా కాచినపుడు గాలి ఉంచుతవి కాగానే రాలిపోవును.

ఈపండ్లు దౌలతాబాదులోనేగాక ఔరంగాబాదుజిల్లాలోను, ఔరంగాబాదులోని, జల్నా[illegible]యంలోను, బిడ్డాపూరులోను కరంజాపూరులోను పెంచబడుచున్నవి. ఈ తోటల కాపు అంతయు ఔరంగాబాదు, జాల్నాలలో అమ్ముడుపోవుచుండును.

---

## హరిజనులకు అన్నదానము

(విలేఖరి) శంకరంపేట: ౨౯-౧౦-౪౫.

ఈయూరనొక నరసింహులనువాడు నీలకులమునకుచెందినవారు తనకులవృత్తియగు బట్టలనేతవలన జీవించుచున్నవారు. ఈ శ్రావణశుద్ధ పౌర్ణమి సోమవారము సాయంత్రము తనగృహమందు సత్యనారాయణ వ్రతమాచరించెను. ఈసందర్భమున తనకులసోదరులకు ఇంచుమించు ౩౦౦ స్త్రీపురుషులకన్నదాన మొనర్చెను. మరునటిరోజున సుమారు ౩౦౦ హరిజనులకు మున్నగుబీదలకన్నదాన మొనర్చెను. వీరు ధనవంతులలో లెక్కించదగినవారు కాకపోయినను వీరి ఔదార్యము మిక్కిలి ప్రశంసింపదగినదైయున్నది. వీరీవిధముననే ౧౫ సంవత్సరములనుండి ప్రతివత్సరపు శ్రావణ మాసమున యొనర్చుచున్నారు.

---

## శ్రీశ్రీజగద్గురు శంకరాచార్య హంపి విరూపాక్షస్వాములవారు

హాస్పి: ౩-౮-౧౯౩౬:—

హంపీ విరూపాక్ష సంస్థాన కార్యదర్శి యిట్లు తెల్పుచున్నారు:—

రాయచూరు జిల్లాలోని గ్రామాలను చూచుగాని అనుమానములలోపల, మహబూబునగరం జిల్లాలోని గ్రామాలకు పోవుచున్నారు. పై సంస్థానమునుగురించి నైజాం ప్రభుత్వమువారు శ్రీవారికి యేలాటి తొందరలేకుండా, సౌకర్యములనిమిత్తం దయచేసిన అనుగ్రహము ౧౩౪౫ఫసలి నెం ౨౪౪౪ రు. ఆజ్ఞ ప్రకారం. అన్నిజిల్లాల తాలూకుదార్లకు ప్రత్యేకముగా తెల్పినారు

౩ పూర్వప్రకారం. అన్నిజిల్లాలకచ్చేరిలో శ్రీవారి సేవనిమిత్తం ఆచార్య స్వాములను గురించి కొన్నిసౌకర్యములను పూర్వపద్ధతిప్రకారం చేయగలరు. ఇందుమూలకముగా శిష్యులకు తెల్పడమైనది

---

## చిఱుతపులిపికారు

బీదరు ౨౫ షహరేవరు ౧౩౪౫:—

హుమ్నాబాదునకు రెండుమైళ్ల దూరమునగల కొల్లూరు అనే గ్రామమునకు ఒక చిఱుతపులి ౭-౮ మాసములనుండి అలవాటుపడి ఆరేడు మందిమనుష్యులం చంపివేసినటుల తెలియుచున్నది. షహరేవరు ౯వ తేదిరోజు హుమ్నాబాదు గ్రామప్రజలు సమూహముగావెళ్లి చిఱుతపులిని చంపివేసినట్లును ఈప్రజలలో నొకడగు సయ్యదు షహాబొద్దీన్ [వ్యాపారస్థుడు] యొక్క దెబ్బయే అమృగము చావునకు కారణమయినటులను తెలియుచున్నది.

---

## ప్రకటన

దీనివలన సర్వజనులకు తెల్యజేయునదేమనగా మ॥ దూలూరు తా॥ జగిత్యాలలో వుండు డి. వెంగలప్ప అవుసులరాములు వ గంమ్ముడైన సత్తెంలు వ వెంకయ్య యు ముబ్బాకు తమస్వంతవ్రాయిదేయిల్లు అనగా కాసమహరి నిషాన్ ౧ ఖానగల యిల్లు యువనామసంవత్సర ఆషాఢశు॥ ౧౩ లు రోజున నావద్ద ౫౦ యాభై రూపాయిలు నగదుతీసుకొని దస్తావేజుపైన రహీన్‌నామ ముకమ్మిల్ చేశి వ యిల్లుకబుజా యిచ్చివుండెను. సదరురూపాయిలు ఒకసంవత్సరం అనగా ధాతనామసం॥ర ఆషాఢశు॥ ౧౩ రోజున అదాయిచేసే షర్తువుండెను. షర్తుముతాబకు సదరు రూపాయిలు అదాయిచేయని యెడల సదరుయిల్లు,సదరురకం కిందికి ఖతము వుంచుకోవలసినది. అని షర్తువ్రాసి యిచ్చివుండెను; కావున, షర్తు ప్రకారం ఒకు రకం చెల్లించలేదు. నేటి తారీఖువరకుకూడా చెల్లించలేదు. కావున, ముందు యెవ్వరైనా యిట్టి నెంబరుగలయిల్లు సదరు మాలకుతో రిజిష్టర్ న బైనామ వ రహీన్‌నామ చేయించుకోకూడదు. అని ముందుగా పత్రికాముఖముగా తెలుపనైనది.

ద॥ ఏ. నరహరిరావు న॥ కాశిరావు,

మ॥ దూలూరు తా॥ జగిత్యాలు

---

## సహారా ఎక్స్ట్రా

SAHARA

GUARANTEED BLADE

శుభ్రమైన నున్ననిక్షౌరములకొరకు సహారా ఎక్స్ట్రాబ్లేడును వాడుడు.

౫ బ్లేడ్లు గల పాకెట్ వెల 4అణాలు

పోస్టుబాక్సు నెం. 154. బొంబాయి.

---

# ZANDU Pharmaceutical Works Ltd., P. O. Box 5513, Bombay

జాండూవారి సుప్రసిద్ధ ఆయుర్వేదౌషధములకై

అఖిలభారత ఆయుర్వేద ప్రదర్శనములలో సువర్ణపతకములు బహుమానముగా పొందిన ఆయుర్వేదముల నౌషధములు. గొప్పగా యంత్రములచేత సిద్ధపరుపబడుచున్న ఈ ఔషధములు దాని శాస్త్రోక్తరీతిగా తయారుచేయబడుచున్నవి.

### ద్రాక్షాసవము

నరములకు బలమిచ్చు రుచిగలపానీయము. శ్వాసకోశములకు బలమిచ్చి దగ్గు. అయాసము, మలబద్ధము తొలగించును త్రాగుడుయొక్క అలవాటును తొలగించును

౧౪ పౌను బి.జి. రు ౨—౦—౦

౧ పౌను బి. జి. రు ౧—౦—౦

౪ పౌను బి.జి. రు ౦—౧౪—౦

ZANDU'S Malaria Mixture

MALARIA MIXTURE

THE ZANDU Pharmaceutical Works Ltd. BOMBAY.

Drakshasava

DOSE

### మలేరియా మిక్శ్చర్

చలివిడుపు జ్వరములకు గొప్ప నివారిణి కడుపులో జ్వరబిళ్లలను పోగొట్టును. (ప్రతిఫలము రాకున్న గుణమిచ్చగలదని గ్యారంటీ నిచ్చును.)

౧ బుడ్డి బి. జి. ౦—౧౩—౦

వి. పి. ఛార్జీలు ప్రత్యేకము.

### కేసరీజీవన్

దుర్బలుల పాలిటి కల్పవృక్షము వీర్యవృద్ధి పరచి బలమును, ఉత్సాహమును కలుగజేయును. పథ్యములేనిమందు. క్షయ మొదలగువ్యాధులకు అద్భుత నివారిణి.

౧ పౌను బి జి. రు. ౫—౦—౦, ౪ పౌను బి.జి. రు. ౨—౧౨—౦

౦।౦ పౌను బి. జి. రు. ౧—౯—౦

సోల్ ఏజంట్లు—డి. జె. పారెఖ్ అండుకో

జుమ్మామస్జిద్ వద్ద, సికింద్రాబాదు (దక్కన

బ్రాంచి:—డి. జే. పారెఖ్ అండుకో.

సుల్తానుబజారు, హైదరాబాదు - దక్కన్

---

## ఈ అంకెలను చూచిన నిజము తెలియును

మొత్తము చేసినవ్యాపారము

రూ ౧౦౦ ౦౦ ౦౦౦ లకు మించినది

ఇంతవరకు చెల్లించిన క్లెయిములు

రూ ౧౫౦౦ ౦౦౦ ”

మొత్తము ఆస్తి

రూ ౧౧౦౦ ౦౦౦ ”

మొత్తము నిధులు

రూ ౨౦౦ ౦౦౦ ”

కిస్తీలవల్ల వచ్చిన ఆదాయము

౫౦౦ ౦౦౦ ”

నెలంకి రూ౧౦౦ జీతముపై ఇన్స్పెక్టర్లు కావలెను.

చీఫ్ఏజంట్లు

వీనస్ అష్యూరెన్సు కంపెనీ లిమిటెడ్, బ్రాంచి

కేంద్ర స్థానం. అన్నత్రికొడురుగా సికింద్రాబాదు [దక్కన్]

---

## కావలెను!

నిజాము రాష్ట్రమందంతటను జీతముపైనను, కమీషనుపైనను, పలుకుబడిగల, ఆర్గనైజర్లు, ఏజంట్లు కావలెను.

జీ ఇందలి భీమాపద్ధతులు మిగుల ఆకర్షణీయములు, వైద్యపరీక్షలేక జీవిత భీమా లంగీకరింపబడును. స్త్రీ జీవిత భీమాలుగూడ అంగీకరింపబడును.

వివరములకు వెంటనే చీఫు ఏజంటుకు వ్రాయుడు:—

చీఫ్ ఏజంటు:—ది మైసూరు ఇన్సూరెన్సు కంపెని లిమిటెడ్

ముసాహిబ్ మంజిల్, అబిదురోడు, హైదరాబాదు.

## విలేఖకులకు

ఈక్రింది ప్రకటింపనైనవి:—

౧ "అశ్వారావుపేట స్త్రీల దురంతము" అను వార్త

౨. "మహబూబునగరు వార్తలు" అను అతిశీవర్షన

౩. బూర్గంపాడు మోటరు ప్రమాదమునుగూర్చి విలేఖకుడు సంతకము చేయక "కళ్యాణి" అనుపేరుతో పంపినవార్త

౪ "పురాతన సువర్ణ రూపాయలు" అను మహబూబునగర విలేఖరి పంపినవార్త [ఇట్టివార్తను ఇదివరకే ఒకసారి ప్రకటించియున్నాము. అంతకంటె దీనిలో విశేషమేమియు లేదు.]

---

# గోలకొండ పత్రిక

ధాత నామ సం॥ శ్రావణ బ॥ ౫

## సోమవారము

---

## పేష్కారీ ఎస్టేటు విద్యానివేదిక ౧౩౪౪ఫ.

"పేష్కారీ ఎస్టేటుయొక్క విద్యాశాఖానివేదిక" అను పేరుగల ౧౩౪౪ఫ ఉర్దూనివేదిక మాకార్యస్థానమునకు ఎస్టేటు కార్యదర్శిచే పంపబడినది. "పేష్కారీ ఎస్టేటు" అనగా, ప్రస్తుతము, మ. ఘ. వ. నిజాం ప్రభుత్వమున సదరెఆజం (ప్రధాన మంత్రి)పదవి నలంకరించియున్న మహారాజా సర్ కృష్ణప్రసాదుబహద్దరుగారిస్వంతసంస్థానము. విఖ్యాతమైన ఈ ఎస్టేటుయొక్క విద్యాభివృద్ధినిగురించిన నివేదికనంపి విమర్శనమున కవకాశము కల్పించినందునకు మేము కృతజ్ఞత దెల్పుచున్నాము.

ప్రధాన మంత్రిత్వముతో సంబంధములేకయు, ఈఎస్టేటు ప్రత్యేక గౌరవమునకు పాత్రమైనదియు. పురాతనమైనదియునైయున్నది. పురాతనమగు వంశమర్యాదనుబట్టియు, వారికి సహజముగు ఔదార్యము, విద్యాభిరతత్వమునుబట్టియు మహారాజా బహద్దరుగారు అసాధారణ మహాపురుషులై యున్నారు ఇట్టివారి పాలితులగు ప్రజలు ఉన్నత విద్యాభివృద్ధినిపొందుటకు అర్హులై యున్నారు.

ఎస్టేటునందిప్పుడు నడుపబడుచున్న పాఠశాలలసంఖ్య, విద్యార్థులసంఖ్య, ఉపాధ్యాయులసంఖ్య మొదలగు వివరములు వేరొకచో నీపత్రికయందు ప్రకటింపబడినవి; అవిచాల ప్రోత్సాహకరములును, వృద్ధిమార్గోన్ముఖములనునై యున్నవనుటకు సందేహములేదు. ఆధునిక విద్యావిధానమునకు ముఖ్యలక్షణములగు సర్వవిషయములు బాలురవిద్య, స్త్రీవిద్య, హరిజనులవిద్య, శారీరకవిద్య, బాలభటోద్యమము, విద్యార్థుల సమావేశము, విద్యార్థినేతనము, పాఠశాలామందిర నిర్మాణము, వసతిగృహపద్ధతి మున్నగునవన్నియు క్రమముగా ప్రవేశపెట్టబడియున్నవి, వృద్ధిపరుపబడుచున్నవి. ఇదియెంతయు ప్రశంసనీయము.

ఉపాధ్యాయ వర్గమునందు, వివిధ భాషలయందు విద్వాంసులగువారు కానవచ్చుచున్నారు. ఆంగ్లవిద్యాపట్టభద్రులతోపాటు, వేదాంతశిరోమణులును, మౌల్వీ మున్షీపరీక్షా పారంగతులును పోషింపబడుచు విజ్ఞానమును ప్రసరింపజేయుచుండుట మహారాజా బహద్దరుగారి వివిధభాషా ప్రియత్వమునకును, వివిధమతసహిష్ణుతకును వారి స్వీయాచరణమువలెనే ప్రజల నిదర్శనమై యున్నది.

వేములవాడలోని సంస్కృతపాఠశాల, పురాతన గీర్వాణ వాఙ్మయము క్షీణించుచున్న ఈకాలమున చాల ఉపయోగకరమైనది. ఈసంస్థను, వేములవాడలోని ఇతరవిద్యాసంస్థలనుమేము స్వయముగా చూచియున్నాము. అప్పటి అనుభవమునుబట్టి, ఎస్టేటుయొక్క విద్యాశాఖవారు ప్రజలందు విద్యాభిరుచిని కలిగించుచున్నారని చెప్పగలము.

ఎస్టేటువారు నివేదిక వత్సరమున దాదాపు పదునెనిమిది వేలరూపాయలు వ్యయముచేసియున్నారు. నెరుకటివత్సరములకంటె ఇదిమంచి అభివృద్ధియేకాని, సుమారు పదిలక్షల ఆదాయముగల ఎస్టేటునకు,ఇంకను ఎక్కువద్రవ్యము విద్యావ్యాప్తికై వ్యయముకావలయును.ఇప్పుడునాగుచున్న వేగముతో క్రమముగా విద్యాశాఖవారు వృద్ధిమార్గమున ముందుకుబోయినచో చాల లాభప్రదమును,కీర్తిప్రదమును నగు ఫలితములు కానవచ్చును.

ఎస్టేటుయొక్క కార్యదర్శి శ్రీయుత గుడేరావుగారు ప్రతిశాఖయందును—ముఖ్యముగా విద్యావిషయములందు—ప్రత్యేకముగ అభినివేశమును ప్రకటించుచున్నారు. ఏతత్కృషి ఫలితములలో వార్షికనివేదిక ప్రకటించుట యొకటియైయున్నది. ఏ ఇతర ఎస్టేటువారును నివేదికలు ప్రకటించుటలేదు. కనుక ఈ ఎస్టేటువారి ఆదర్శము విద్యాప్రచార విషయమున మాత్రమేకాక, వివరములను ప్రకటించుటయందుగూడ ఇతర సంస్థానములకు మార్గదర్శకము కాదగియున్నది.

ఎస్టేటు విద్యాశాఖాధికారియగు పండిత ముకుందరావు, బి. ఏ. ఎల్ ఎల్.బి గారి యుత్సాహమును, సత్సేవను మేము ప్రశంసించుచు ౧౩౪౫ఫసలి నివేదికయందు శ్రేష్ఠతరమగు ఫలితములను చూచుటకు ఆశించుచుందుము.

---

## అఖిలాంధ్ర కథకుల సమ్మేళనము

### తేదీలలో మార్పులు

ఈఆగష్టు ౯వ మరియు ౧౦వ తేదీలలో శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయములో జరుపదలచిన అఖిలాంధ్ర కథకుల సమ్మేళనోత్సవము కొన్ని అనివార్యకారణములచే ఇదే నెల ౨౩వ మరియు ౨౪వ తారీఖులలో జరుపనిశ్చయించబడినది

---

### సైకిలు దొంగతనము

౧౨ షహరేవరు ౧౩౪౫వాడు ఒకసాహెబు గోలకొండ దుర్గమునుంచి బాడుగసయికిలుపై ఇసునాపురము పోవుచుండగా, సమీపమునందు ముత్తగిఅను గ్రామమువద్దనుండి వాగువద్ద సయికిలును పదిపంద్రెండురూపాయిల సామానుకుంచి, ఎదురుగాలిచే గిలిగింతలు వి(?) ష్నానొన యత్నించెను. నిద్రపోవుచుండగా ఎవరో సయికిలుసామాను తీసికొనిపోయిరట సాహెబుగారు కిరాయసయికిలు యజమానులకు మూల్యం సమర్పించుకొని పోలీసువారలకు తెలియజరచిరి. పోలీసువారు నేరస్థులకై వెదకుచున్నారు—అని ఒకవిలేఖరి దెల్పుచున్నాడు

---

### మున్షీపరీక్ష

స్టేషన్ రోడ్డు యాఖూతుపూరానుండిఅర్హగ విద్యార్థులు మున్షీపరీక్షకై పంజాబువెళ్లియుండిరి. వారిలో ఈదిగువవారు ఉత్తీర్ణులైరి:— ౧ మీర్ ఖాసింఅలీ ౨ గులాముసమ్దాని, ౩ సయ్యదు అహమదుహుసేని, ౪ సయ్యదు అహమదు మొయొద్దీన్ సిద్దీఖి, ౫. గులాం నసీరొద్దీన్. మున్షీఫాజల్ విద్యాశిక్షణము మెహరు ౧౩౪౫ ఫ. నుండి ప్రారంభించబడును. మెహరు ౫ వ తేదివరకు ప్రవేశించినవారికి ప్రవేశరుసుము మాఫుచేయబడునటుల తెలియుచున్నది.

---

### రక్షాబంధనోత్సవము

(రాఖీపౌర్ణమి)

భాగ్యనగర ఆదిహిందువులు గతఆదివారము సాయంత్రము "మహనాటి ఆదిహిందూ భవనము"లో సమావేశమైరి. గోషామహల్ శాంతినికేతన భజనమండలివారు, చుడీబజారు సంఘసుధారక మండలివారు సంఘసంస్కారగానపూర్వకమైన భజనలు గావించిరి

తదనంతరము దైవప్రార్థన జరుపబడెను రాఖీపౌర్ణమి ప్రాచీనపద్ధతి, వర్తమానకాల పరివర్తనము ఆదిహిందువుల కర్తవ్యమునుగురించిన యుపదేశములు "శ్రీ శ్రేష్ఠి" భాగ్యరెడ్డిగారిచే బోధించబడెను. అపై ధర్మార్థకామమోక్షములు సాధించుటకు సభాసదులకు రక్షాబంధనము చేసి(రాఖీలుకట్టి, ప్రతిజ్ఞలుగైకొనజడెను

ఆదిహిందూ సాంఘిక సేవాసమితి చాదర్ఘాటుబంతెవ } ఇట్లు జె ఆర్ సే మంత్రి

---

## రైలుదొంగ

ఒక నవాబుగారు బొంబాయినుండి హైదరాబాదునకు తనవెంట ఒక నౌకరుతో వచ్చుచుండెను. మధ్య షోలాపూరునకు కొద్దిఫర్లాంగుల దూరమున ఒకడు రైలునుండి క్రిందికి దుమికినటుల నౌకరు నవాబుకు తెలిపెను. తమసామాను ఏమైన దొంగిలించిపోయెనేమో యని రైలు షోలాపూరు చేరినతర్వాతచూచుకొనగా ౧౨౦౦ రూపాయలనోట్లు, ఒకగయారము బంగారుగొలుసుగలది, రెండు గొలుసులేని గడియారములుగల ఒక షేరువాని దొంగిలింపబడినటుల తేలెను. ఈసంగతి పోలీసువారలకు తెలిపి నవాబుగారు హైదరాబాదునకువచ్చినారు.

---

రాకపోకలు

## నిజాం ప్రభువుగారి కలకత్తా ప్రయాణము

నిజాంప్రభువుగారు నవంబరు తుదివారములో కలకత్తాకు వెళ్లగలరనియు, వెళ్లి తాగూరు భవనములో బసచేసెదరనియు తెలియుచున్నది

---

మౌలానా నబీను అహమదుగారు [బదాయూని] షహరేవరు ౩౦వ తేది నగరమునుండి తిరిగి వెళ్లినారు. వీరిని సాగనంపుటకు నవాబు గాజీయారుజంగు బహద్దరు మరియు మౌల్వీ ముల్ బాసితుఖాను మొదలగువారు నాంపల్లి స్టేషనుకు దయచేసిరి.

---

ఔరంగాబాదు సుంకిపుశాఖ డివిజన్ ఉపాధ్యక్షుల (నాయబునాజం) అగు మౌల్వీ అజీజొద్దీనుగారు జిల్లాదౌరా చేయుచు షహరేవరు ౨౯వ తేది నగరమువిచ్చేసినటుల తెలియుచున్నది

---

### ఉద్యోగ విషయములు

ఆర్థికశాఖ కార్యదర్శియగు నవాబు ఫఖురుయార్జంగు బహద్దురుగారి సెలవుకాలము పూర్తి అయినందున మౌల్వీ లియాఖతుల్ల హెచ్. సి. హెచ్ గారినుండి తమపదవిని స్వీకరించిరి. మౌల్వీ లియాఖతుల్లా హెచ్. సి. హెచ్. గారు మూడుమాసముల సెలవు తీసికొనినటుల తెలియుచున్నది.

---

### హైదరాబాదు ఆయుర్వేద వైద్యసంఘము

ఓషధీ ప్రస్థానము



౭-౫-౩౬వ తేదీ శుక్రవారం సాయంత్రము ౫ గం. లకు వైద్యసంఘసభ్యులును. ఇతరులును సుమారు నలుబదిమంది సమీప ప్రదేశములయందును. సీతారాం బాగు నందును సుమారు ౯౦ ఓషధులను పరిశీలించి ప్రత్యేక ఓషధియొక్క రూపమును, గుణధర్మములను భిన్నభిన్న నామములను మూలికాజ్ఞానముగల వైద్యవరులు వివరించి సభ్యుల కెరుకపరచిరి.

ఈపై ఓషధీప్రస్థానమునకు కొన్నూరుని వాసులును.సరస్వతీ బ్రహ్మచర్యాశ్రమాధ్యక్షులును. గొప్ప మూలికావైద్యులును ప్రస్తుతము కొన్నిదినములనుండి మననగరమున (బేగంబజారునందు; నివసించుచున్న పండిత శ్రీమాన్ భాగవతాచార్యులువారు నాయకులుగనుండి నడిపించిరి. అంతమున కార్యదర్శి వందనములతో ఓషధీ ప్రస్థానము ౫౹ గం॥ లకు ముగిసెను.

నోటు:—౨౧-౫-౧౩౪౫ వతేదీ శుక్రవారము ౯ం ౨౹ లకు పదునేడవ సమావేశము "జ్వరము—చికిత్సలు" అను విషయముపై జరుగునుకనుక సభ్యులెల్లరును విచ్చేయప్రార్థితులు.

హైదరాబాదు ౮-౫-౧౩౪౫ } [సం] డా. ఆచార్య ప్రకటన శాఖాధికారి.

---

## హత్యలు!

[ఒక విలేఖరి]

భువనగిరి—౧౧—౧౩౪౫

నేరెడ అనుగ్రామములో మాలీపటేలున్ను పోలీసుపటేలు వివాదపడినట్లును, ఉదయమున పోలీసు పటేలును హత్య చేయబడినట్లును, ఇక్కడివారు ఇనులను కొనుచున్నారు.

## మ. ఘ. వ. నైజాం సంస్థానపు రైల్వే

# ప్రకటన

సికింద్రాబాదు—మహమ్మదాబాదు—బీదరు మధ్యనున్న

పూర్లి—వైజనాథు మధ్యనున్న రైల్వేసర్వీసు.

౧ సెప్టెంబరు ౧౯౩౬ మంగళవారమునుండి సికింద్రాబాదు హైద్రాబాదు పెద్దలైనన్ను, మహమ్మదాబాదు బీదరు లైలున్ను ఇక్సిలరేటు చేయబడును. మరియు ఈక్రింది విధముగా నం. ౯ అపన్ను, నం. ౧౦ డౌనున్ను సికింద్రాబాదు మరియు పూర్లి వైజనాథు రైళ్లకాలము మార్పుచేయబడును.

| ప్యాసింజరు 9 | | | మిక్సెడు 10 | | |
|---|---|---|---|---|---|
| సికింద్రాబాదు | పో | 7-18 | పూర్లి-వైజనాథు | పో | 7-50 |
| హైద్రాబాదు పెద్ద | | | ఉద్గీరు [నిజాం] | రా | 11-46 |
| లైను | రా | 7-34 | | పో | 11-58 |
| | పో | 7-52 | మహమ్మదాబాదు | రా | 15-28 |
| వికారాబాదు | రా | 9-13 | బీదరు | | ప్యాసింజరు |
| | పో | 9-23 | | పో | 16-05 |
| మహమ్మదాబాదు | రా | 11-40 | వికారాబాదు | రా | 18-22 |
| బీదరు | | మిక్సెడు | | పో | 18-30 |
| | పో | 12-16 | హైదరాబాదు | రా | 19-58 |
| ఉద్గీరు (నిజాం) | రా | 15-20 | పెద్దలైను | పో | 20-06 |
| | పో | 15-33 | సికింద్రాబాదు | రా | 40-22 |
| పూర్లి-వైజనాథు | రా | 19-15 | | | |

అదేతారీఖునుండి నం. 21 అప్, మరియు 22 డౌను మిక్సెడురైళ్లు (ఇప్పుడు మహమ్మదాబాదు—బీదరు మరియు వికారాబాదు మధ్యన నడచుచున్నవి) సికింద్రాబాదు మహమ్మదాబాదు బీదరు మధ్యన ఈక్రిందికాలములలో నడుపబడును.

| 21 మిక్సెడు | | | 22 మిక్సెడు | | |
|---|---|---|---|---|---|
| సికింద్రాబాదు | పో | 13-20 | మహమ్మదాబాదు | | |
| హైదరాబాదు | రా | 13-42 | బీదరు | పో | 7-15 |
| పెద్దలైను | పో | 14-02 | వికారాబాదు | రా | 10-41 |
| వికారాబాదు | రా | 16-50 | | పో | 11-15 |
| | పో | 17-03 | హైదరాబాదు | రా | 13-24 |
| మహమ్మదాబాదు | | | పెద్దలైను | పో | 13-46 |
| బీదరు | రా | 20-35 | సికింద్రాబాదు | రా | 14-12 |

సికింద్రాబాదు-దక్కన్ }
3౧ జూలై ౧౯౩౬ } చీఫ్ ట్రాన్స్పోర్టేషన్ సూపరింటెండెంటు.

తనమాతృభాషాజ్ఞానము లేని భారతీయుని ఏమనవలెను? అతనిని భారతీయుడని చెప్పదగునా???

# గోలకొండపత్రిక

# GOLKONDA PATRIKA

HYDERABAD DECCAN
The First Telugu Bi-Weekly in Andhra Desa and the only Telugu Newspaper for H.E.H. The Nizam's Dominions.

వర్తకులారా! నిజాంరాష్ట్రపు ఎనిమిది జిల్లాలలోని ఆంధ్రులలో మీ వర్తకవృద్ధికి సాధనము? గోలకొండ పత్రికలో ప్రకటనము

**Vol. 11.** | **Monday 10—8—1936** | **No. 27**

## నిజాంరాష్ట్రములో
# అంజూరతోటలు

వ్యాసకర్త:
యం. ఆర్. సిద్ధారామయ్యగారు,
యఫ్. ఆర్. హెచ్. యస్., (లండన్)

పేరు:—

దీనిని ఉర్దూలో "అంజీర్" అని అందురు మహారాష్ట్రభాషలోను అదేపేరు ఆంగ్లేయ వృక్షశాస్త్రమందు దీనికి "ఫికస్ కారికా" (Ficus Carica) అనిపేరు

స్థానికపరిస్థితులు:—

హైదరాబాదు రాజ్యమందు పండ్లతోటలు వేసి పెంచుపద్ధతిలో ఎట్టిలోపము గానిలేదు ఒకటి రెండుప్రదేశములలో పండ్లతోటలను ఎక్కువగా పెంచుచున్న వారలకు మంచిలాభములేవచ్చుచున్నవి. కాని కొన్నిపండ్లతోటలు మాత్రము విస్తారముగ పెంచబడుటలేదు. ఉదాహరణార్థము, మౌలాలివద్ద నవాబు సాలార్ జంగ్ బహదర్ గారితోటలో "సైన్ ఆపిల్" ఫలవృక్షములను వేసి ఒకఅర్థశతాబ్దివరకు లాభకరముగ పెంచినారు. ఈఫలవృక్షములను ఇంకను విస్తారముగ పెంచుటకు మంచి అవకాశములుగలవనుటకు ఇదియే రుజువు.

ఇదేవిధముగ, అంజూర ఫలవృక్షముల తోటలవిషయములోను, ఈక్రింద చెప్పబడువివరములు ఈరాష్ట్రములో అతోటలను వేయుటకు గల మంచిఅవకాశములను చూపును. దానినిబట్టి, ఎక్కువవచ్చు కర్చుగాని, శ్రమగానిలేక మీ తెలంగాణాలో మాత్రమేగాక, మరట్వాడాలోకూడ ఈతోటలను పెంచవచ్చునని బోధపడగలదు.

మైసారములో అంజూరతోటలు:—

మైసారము హైదరాబాదుకు దక్షిణమున ౫ మైళ్లదూరములోనున్నది. దక్కను పీఠభూమిలో ఆంగ్లేయులును మహారాసువారును రాజ్యసంపాదనకై, ఒకరితోనొకరు పోటీవేసికొని, యుద్ధించుచున్న కాలములో ఫ్రెంచిసైనికదళమునకు దానికి నాయకుడైన జనరల్ మాన్సియర్ రేమండ్ అనువారినుండి మైసారమునకు ఆపేరువచ్చినది. ఇది పలక్నుమా రైల్వేస్టేషనుకు సుమారు ఒకటిన్నరమైలు దూరమునందు కేశవగిరి—చెన్నరాయనిగుట్టకు సమీపములో నుండు ఒక [illegible]

ఈబస్తీలో అరబ్బీలు ఎక్కువమందిగలరు. వీరలు తరతరములుగా ఈరాష్ట్రసేనలయందును, గొప్పగొప్ప జాగీర్దారులవద్దను, భూస్వాములవద్దను కొలువుచుండినవారు.

మైసారముచుట్టును చిన్నతిప్పలు గలవు. చాలమట్టుకు వాటిమీద ఏమియు పండజాలదు. ఈ తప్పరాయి అధికముగా నల్లరాయి, భూమి తెల్లయిసుకనేలగానో, ఎఱ్ఱయిసుక-సుద్దనేలగానో యుండును. తోటలువేయబడు ప్రదేశములు ఎఱ్ఱనేలలు, అడుగునేల, మొరంనేల, ఒక్కొక్కప్పుడు సున్నము ఇందు కలిసియుండును. నీటిమట్టము సుమారు ౨౫-౩౫ అడుగులుండును, రుచిఉప్పగానో, లేక తియ్యగానో యుండును, పొటాసియం నైట్రేటు కలిసియుండుటచే ఉప్పటినీరెక్కువ.

ఈప్రాంతములో అంజూరతోటలనియు అరబ్బులవి. తిప్పల [illegible] పదేను పడుండి, భూములు ఎగుడుదిగుడుగ నుండును. ఈప్రాంతమునంతయు మొదటనున్న కొలువలు ఏర్పరచెదరు. గుంటలుత్రవ్వి ఒకగుంటకు మరొకగుంటకు మధ్యకాలువల నేర్పరతురు. గుంటలు ౪ అడుగులపొడుగు ౪ అడుగులవెడల్పు ౪ అడుగుల ఎత్తుకలిగియుండును. వాటిలో ౧౦౦ అడుగులనందుండునట్లు ఎరువును శుద్ధమనిపించెదరు ప్రధానముగా అంజూరు, జామ, పపాయ, ఖర్జూరపుతోటలు పెంచబడును. మొత్తముమీద తోటలుచిన్నవి ఎక్కువగా ఈతోటలు దొడ్లలో విశాలస్థలమునందు పెంచబడును వాటిచుట్టును గోడలుండును.

తమ తీరికకాలములో పురుషులు పండ్లతోటలను పెంచు పనినిజూచుకొందురు. పురుషులు తమకొలువుపనిమీద వెలుపోయి యున్నప్పుడుగాని, లేక వారలకు మరేదైనను పనియున్నప్పుడుగాని, అతోటలను ఇండ్లలో స్త్రీలు, అవసరమైనచో కూలిపనివాండ్ర తోడ్పాటుతో పోషింతురు. ఇట్లు వారమునకు రెండుపర్యాయములు నీరుకట్టవలసిన అవసరముగల ౬౦-౭౦ చెట్లతోటను ఒకకుటుంబము నిర్వహించుకొనవచ్చును. సాధారణముగా వర్షములులేనప్పుడు నీరుకట్టుదురు. నీటిని దొడ్డిలోనే ఉండు ఒకచిన్న బావిలోనుండి తీసికొందురు. ౫౦ చెట్లు-అమాత్రమునకైనచో చేతమోటతోనే నీళ్లు తోడుదురు. అంతకంటె ఎక్కువనీరు కావలసినచో ఎద్దులనుపెట్టి పనిచేయింతురు.

ప్రతిచెట్టుకును చుట్టునుండు మట్టినితీసి ఎరువువేయుదురు అరబ్బులు తమతోటలకు నీరుకట్టుపద్ధతి చూడదగినది. వారేర్పరచుకొనిన పద్ధతి చెట్టుకు ఎంతఅవసరమో అంతమట్టుకే నీరు పారించబడునట్లును, చెట్లమొదళ్లలో నీరునిలిచియుండక, నిలువనీరంత భూమిలోనికింకి చెట్లవ్రేళ్లద్వారా ఉపయోగించునట్లును అనుకూలించును.

ఒకఉదాహరణ- ఒకనిదొడ్డిలో ౬౦ అంజూరవృక్షముల తోటగలదు. అతోటలోనికి నీటిని అందజేయుటకై ఇటుకరాతితో కట్టబడిన కాలువలున్నవి. ఇందువల్ల సుద్దనేలలో నీరునిలువకుండ చేయబడుచున్నది.

ఇంకొకతోట ఏటవాలు భూమిపైనున్నది ఇట్టిభూమిలో నీరువేగముగా ప్రవహించుచు నేలలోనికి వ్యర్థముగా ఇంకునభయముండదు. గనుక అటువంటికాలువలేవియు కట్టించబడలేదు. ఇంకొకతోటలో ౧౧-౧౨ వేల చెట్లుగలవు. ఈతోటలో అంతటను ఇటుక కాలువలు కట్టించబడియున్నవి. ఈ ఉదాహరణలన్నియు ఈ తోటమాలులు నీరుకట్టు విషయమున వహించు శ్రద్ధను తెలుపుచున్నవి. శాంతశ్రద్ధ [illegible] గానుట వారితోటపనుల ముఖ్య విజయకారణములలోనొకటి. మైసారంలో అరబ్బీలవి మొత్తముమీద ౧౦౦౦౦ అంజూరవృక్షములు గలవు. కొందరికి ౧౨౦౦ చెట్లు, కొందరికి ౯౦౦ చెట్లు, మరికొందరికి అంతకంటెతక్కువ-ఇట్లు నానావిస్తీర్ణముల తోటలున్నవి. ఇప్పుడు తోటలలోవేయబడు ఫలజాతి మొదట ఎక్కడ ప్రవేశపెట్టబడెనో తెలియదు. మొత్తానికి ఈజాతిచెట్లతోటలు ౧౨-౧౫ ఏండ్లక్రింద ప్రవేశించినట్లు చెప్పుదురు. మైసారంచుట్టును కొంతదూరమువరకు భూమిని, దరఖాస్తుపెట్టుకొన్నచో, ఉచితముగనిచ్చెదరు. నాటుకొన్న చెట్లపై కనపడు చిన్నరెమ్మలకన్నింటికిని చాలవరకు పండ్లువేయును. నీరు చాలినంతలేదని కట్టుటమానుకుండినచో, ఈక్రొత్తరెమ్మలపై పండ్లు త్వరగాపుట్టును. దీనినిబట్టి ఈతోటలకుఫలములేని ఋతువేలేదు. సంవత్సరము పొడుగునను కాపు ఉండనేఉండును. కాని వర్షాకాలములోవచ్చుపండ్లు ఎండకాలములో పండేపండ్లకంటె తక్కువతీపిగలవి.

ఈతోటలు వేయువారలు చెట్లకొమ్మలను కొట్టి వాటిని నాటుపద్ధతి నవలంబించుటలేదు. రూపాయ ౧కి ౩ మొక్కలుకొని ౪ అంట్లవంతున కొనితెచ్చి ఆఅంట్లను నాటుదురు.

ఈచెట్లు సాధారణముగా ౧౫ సంవత్సరములుజీవించును మైసారం అంజూర పండుకును, పూనా అంజూరపండుకును చాల భేదముగలదు. రెండవది ఊదారంగుగలిగి యుండును మొదటిది ధూసరవర్ణముగలిగి కొనరక్తవర్ణము గలిగియుండును.

చెట్టు ఒకటికి ౪౦౦ మొదలుకొని ౫౦౦ పండ్లు ప్రతిసంవత్సరముకాచును. పండ్లు గొప్పవైనచో నూటికి రూ. ౪ లవంతున అమ్ముడుపోగలవు. ఏలెక్కన అమ్ముడుపోవునది ఆపండ్ల ప్రమాణమునుబట్టియు, వాటియందున్నగుణములనుబట్టియు ఉండును; సాధారణముగా రూపాయ ౧కి ౧౨ మొదలుకొని ౪౦ వరకు అమ్ముడుపోవచ్చును. ఈపండ్లు గ్రామపుసంతలో వేలమువేయబడును. అప్పుడువాటిని హైదరాబాదు పండ్లవర్తకులుకొందురు. ఈపండ్లుచెట్లపైనున్నప్పుడు వాటికి పక్షులవలన నాశముగలుగకుండుటకై ఒక్కొక్కదానికి ఒక కాగితపుగరెట్టు అడబీకిప్పుదురు; అడబీకి ఒకరంధ్రము చేసియుందురు.

ఈపండ్లు సాధారణముగా పూనానుండియు ఈసంస్థానమునకు వెలుపలనుండు ఇతర దేశములనుండియు దిగుమతిచేయబడు అంజూరఫలములకంటె ప్రియమైనవి.

మైసారంనుండి సుమారు ఒక మైలుదూరమునందు క్రొత్తపేటగ్రామములో ఇంకను ఎక్కువ విస్తీర్ణప్రదేశమందు అంజూరతోటలు పెంచబడుచున్నవి. అరబ్బులు పూర్తిగా వ్యాపారముపెంచునది ఈ అత్తితోటలు ఒకటియే, దీనికి ఏతెగుళ్లుగాని తగులవు, అధమపక్షము ఎవరును దానికి భయంకరమైన తెగులు ఏదిగాని తగిలినట్లు ఇంతవరకుచెప్పలేదు.

ఈరాష్ట్రములో వరంగల్లుసమీపమున నుండు హనుమకొండవంటి ఇతరప్రదేశములలో సంవత్సరముపొడవునను చాలినంతనీరులభించు సుద్దనేలలో ఈఅంజూరతోటలు చక్కగా వృద్ధియగుచున్నవి. ఈచోట్లలోను, దౌలతాబాదులోను చిన్నకొండలును, తిప్పలును చుట్టుప్రక్కల దగ్గఱనుండుటచే వాటినుండి ప్రసరించు వేడిమి ఈచెట్లు త్వరత్వరగా వృద్ధికివచ్చునట్లు చేసి, త్వరగా పండ్లుపండునట్లుచేయును.

ఈతోటలను తెలంగాణా ప్రాంతములో నీరున్ను, ఎరువున్ను చాలినంత నమ్మకముగా దొరకుచోట్లలోగూడ పెంచవచ్చును. దీనికి ఎరువు సమృద్ధిగానుండుట చాల ముఖ్యము.

దౌలతాబాదులో అంజూర తోటలు:-

దౌలతాబాదులో హార్టికల్చరల్ సూపరింటెండెంటుగ పనిచేసి, ఇపుడు హిమాయత్సాగరు ఫారములోనున్న ఆర్. శంకరపిళ్లె, బి. ఏ. బి. జి; గారు ఔరంగాబాదు జిల్లాలో పండ్లతోటలను గురించి ఈక్రిందివిధముగ వ్రాసియున్నారు: "దౌలతాబాదు (ఔరంగాబాదు జిల్లా) ఒకప్పుడు పండ్లతోటలకు మంచి ప్రసిద్ధిగాంచినది. అక్కడి అంజూరపండువంటిదానిని మరెక్కడను చూడలేదు. రుచి, సువాసన, ప్రమాణము, స్వరూపములలో దౌలతాబాదు అంజూరపండు ఇతరచోట్ల అంజూరపండ్లకంటె శ్రేష్ఠతరమై గొప్పజాతిపండనుటకు సందేహములేకుండెను. ఇది [illegible]టను పేరుపొందినది. అందుచే ఎక్కడనుండు ఢిల్లీలోకూడ అంజూరపండ్లు "దౌలతాబాదు అంజూరపండ్లు"గా అమ్మబడుచుండెడివి. పూర్వము గొప్పగొప్ప వారలు ఇండ్లలో దౌలతాబాదు పండ్లనిన ప్రేమ ఎక్కువ."

రకములు:-

పండ్లు చక్కగా పండినప్పుడు కొంత పసిమిచాయతోగూడిన రక్తవర్ణము గల్గియుండు పండ్లజాతి ఒకటియే ఇచట పెంచబడును.

పండించువిధము:-

చెట్ల కొనకొమ్మలను, కొనఇగుళ్లతోను కత్తిరించవలెను. వాటిని వానలు కురియునప్పుడు తోట్లలోనుంచవలెను. ఈవిధముగ చిన్న మొలకలుపుట్టును. ఇవి మరలవర్షాకాలమునకు నాటుటకు సిద్ధములగును. అప్పుడు వాటిని చుట్టును మట్టిగుద్దతోకూడ తీసి [illegible] సాధారణముగా రెండడుగులపొడుగును, రెండడుగుల వెడల్పు, రెండడుగుల లోతుగల గుంటలో ౧౮ మొదలుకొని ౧౫ అడుగులదూరము [illegible] యుండునట్లు నాటవలెను. మొదటి రెండేండ్లలో పొట్టిగా పెరుగు మిరప, ఎఱ్ఱగడ్డలు [illegible] దలగువాటిని మధ్య సందులలో వేసి పెంచుదురు.

కత్తిరింపు:- మొలక యొక్క ప్రారంభములో ఒకటేకత్తిరింపు చేయుదురు. మొలక అడుగున్నర ఎత్తుపెరిగినప్పుడు అకత్తిరింపు చేయుదురు. మొలకకు కొమ్మలుపుట్టుటకై పైకొన కత్తిరింతురు.

కోత:- ఈవిధముగా కోసినపండ్లు తియ్యదనముగా పుల్లనిపండ్లుగానుండును, తియ్యదనము నిమ్మతోటలుకూడ [illegible] చబడును, కాని [illegible]

(ఇంకా ఉన్నది)

Printed and Published by B. Ramakrishna Reddy at the Golkonda Power Press Hyderabad. Editor K. Balakrishna Reddy.